

## శ్రీమతే రామానుజాయ నమః

# అచ్యుతశతకం



**దేవనాథ పెరుమాళ్, తిరువహీంద్రపురం**




'పండితరత్న'

డా॥ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళగ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# అచ్యుతశతకం

**అవతారిక:**

తిరువహీంద్రపురంలోని "అడియవర్ క్కు మెయ్యన్" అనే దేవనాయకస్వామిని ఉద్దేశించి ఈ స్తుతి రచింపబడింది. ఇక్కడ ఉండే స్వామి అచ్యుతుడని పిలువబడుతున్నాడు. అచ్యుతుడంటే—భక్తులను విడువనివాడని అర్థం. భక్తులను ఏ రీతిలోను విడువని ఈ స్వామికి అచ్యుతనామం యుక్తమైనది కదా! ఈ అచ్యుతుని కీర్తించే 101శ్లోకాలను కలిగి ఉన్నందున అచ్యుతశతకమనే. పేరు వచ్చింది. ఇది ప్రాకృతభాషలో రచింపబడింది.

ప్రాచీనకాలంలో విద్వాంసులైన పెద్దల కుటుంబాలలో సంస్కృతభాషలోనే వ్యవహారం జరిగేది, స్త్రీలు, బాలురు మొదలైనవారికి వ్యాకరణంతో పరిచయం లేనందున క్రమంగా వారు మాట్లాడే భాషలో కొంత మార్పు ఏర్పడి, అది ప్రాకృతభాష అయింది —అని భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయం, దీనికి తగినట్లు ఈ భాషకు ప్రాకృతమనే పేరు కలిగింది. ప్రకృతి అంటే సంస్కృతం, దానినుండి పుట్టినది కనుక ప్రాకృతమైనది. మరికొందరి అభిప్రాయంలో ప్రాకృతం సంస్కృతంవలె ఒక ప్రత్యేకమైన భాష. స్త్రీలకు, బాలురకు ఈ భాషనే నాటకాదులలో వాడాలని లక్షణగ్రంథాలు నిర్దేశించాయి. కొంతకాలానికి ఈ భాషకుకూడ శాస్త్రీయమైన వ్యాకరణం ఏర్పడింది, పండితులుకూడా దీనిని ఆదరించి, దీనికి సముచితస్థానాన్ని ఇచ్చారు. బాలభాషవలె

ఇది చెవులకు ఇంపైనది. ప్రాచీనసంస్కృతనాటకాలలో స్త్రీలకు ప్రాకృతభాష వాడబడింది.

సర్వతంత్ర స్వతంత్రులైన దేశికులకు ప్రాకృతభాషలోకూడా ఒక రచన చేయాలనే అభిప్రాయం కలిగి, ఈ స్తుతిని ప్రాకృతభాషలో వెలయించారు. దివ్యసూరులు భగవానుని విషయంలో నాయకీభావాన్ని పొంది పాశురాలను పాడినట్లుగా, దేశికులు దేవనాయకుని విషయంలో తమకుండే అభినివేశాతిశయంవల్ల నాయకీభావాన్ని పొంది పల్కడం "దేవనాయకపంచాశత్" అనే స్తుతిలో, ముమ్మణిక్కోవై అనే ప్రబంధంలో చూడవచ్చు. దేవనాయకుని దివ్యసౌందర్యంలో అంతు లేని అభినివేశాన్ని పొంది, దానివల్ల నాయకీభావాన్ని పొందిన దేశికులు, ఆ భావానికి తగిన భాష అయిన ప్రాకృతంలో ఈ స్తుతిని రచించారు. ఆళ్వారులు నాయకీభావంతో పలికిన పాశురాలలో ఎన్నో శాస్త్రార్థాలను వ్యక్తం చేసినట్లే, దేశికులుకూడా నాయకీభావంతో పలికిన ఈ స్తోత్రంలో పలు శాస్త్రార్థాలను వర్ణించారు. సంస్కృతంలో ప్రాకృతంలో, ద్రావిడంలో –మూడు భాషలలో దేశికులు స్తుతించిన వైలక్షణ్యం ఒక్క దేవనాయకస్వామికే ఉన్నది.

ఇందులో దేశికులు దేవనాయకుని సర్వేశ్వరత్వాన్ని తెలిపే పలు అంశాలను ప్రస్తావించారు., దివ్యావయవాల, వర్ణనను చేశారు., ప్రపత్తినిష్ఠుల మహిమ, అర్చిరాదిమార్గం, వైకుంఠంలో అనుభవించే వైభవాలు, ఎన్నో సిద్ధాంతవిషయాలు ఇందులో గోచరిస్తాయి. స్తుతిచివర ఫలశ్రుతిని పలుకుతూ, ఇది మంచి మనస్సు కలవారిచే సదా అనుసంధేయమని అన్నారు. దీనిని భక్తితో అనుసంధిస్తే, చిన్నపిల్లల

అచ్యుతశతకమ్

ముద్దు మాటలను విని తల్లిదండ్రులు సంతోషించేటట్లే, దేవనాయకస్వామి, శెంగమలనాచ్చియార్ దివ్యదంపతులు చాలా ఆనందించి, చల్లగా కటాక్షిస్తారు.

1) ణమహ తిఅసాణ ణాహం సచ్చం దాసాణ అచ్చుఅం ఠిరజోఇమ్ |
గలుల ణఇ తడ తమాళం అహిన్ద ణఅరో సహాఅ లేక్క గఇన్దమ్ ॥

నమత త్రిదశానాం నాథం సత్యం దాసానామచ్యుతం స్థిరజ్యోతిమ్ |
గరుడనదీ తట తమాలమ్ అహీన్ద్రనగరౌషధాచలైక గజేన్ద్రమ్ ॥

గరుడనదీతీరంలో ఆవిర్భవించిన తమాలవృక్షంవంటివాడు, తిరువహీంద్రపురంలోని ఔషధాద్రిలో ఉండే సాటి లేని గజంవంటివాడు, ఏనాడూ తరగని తేజస్సు, తనను, ఆశ్రయించినవారిని ఏనాడూ విడువనివాడు, భక్తులకు సత్యస్వరూపుడైన దేవనాయకస్వామిని నమస్కరించండి.

2) కిఙ్కరసచ్చ థుఈఅ తుహ సఅంభు గేహిణి విలాసవాహిత్తిమయీ l
ఫణిఆ బలేణ మఏ పఞ్జర సుఅ జప్పిఅం వ కుణఉ పసాఅమ్ ॥

కిఙ్కరసత్యస్తుతిస్తవ స్వయంభూగేహినీ విలాసవ్యాహృతిమయీ l
ఫణితా బాలేన మయా పఞ్జరశుకజల్పితమివ కరోతు ప్రసాదమ్ ॥

అచ్యుతశతకమ్

భక్తులకు సత్యస్వరూపా!బాలుడనైన నాచే రచింపబడేది, బ్రహ్మపత్ని అయిన సరస్వతికి ఉల్లాసాన్ని కలిగించే ముద్దు పలుకు అయిన ఈ స్తుతి, గూటిలోని చిలుక పలికే మాటవలె, నీకు సంతోషాన్ని కలిగించాలి.

**3) మఇల వి భాసిఅం మహ కింకరసచ్చ తు కిత్తి జోణ్హా పసరే ।**

**లగ్గం లహఉ విసుద్ధిం రచ్ఛా సలిలం వ తివహాఅ సోత్త గఅమ్ ॥**

**మలినమపి భాషితం మమ కిఙ్కరసత్య తవ కీర్తి జ్యోత్స్నా ప్రసరే ।**

**లగ్నం లభతాం విశుద్ధిం రథ్యా సలిలమివ స్రోతో గతమ్ ॥**

దాససత్యా! నాథా! దాసుడనైన నా మాట దోషాలను కలిగినది అయినా, నీ కీర్తి అనే వెన్నెలప్రసారంతో సంబంధాన్ని పొందినందున, గంగాజలప్రవాహంతో కలసిన దారిలోని నీరువలె, పవిత్రతను పొందనీ.

**4) తత్థరి ణఏణ ఠవిఆ సోహఉ తిఅసాణ ణాహ తుజ్ఝ సమాఏ ।**

**వన్దిత్తణ మహిఆణం మజ్ఝమ్మి సుఈణ బాలిసా మజ్ఝ థుఈ ॥**

**త్రస్తరి నయేన స్థాపితా శోభతాం త్రిదశానాం నాథ తవ సమాజే ।**

**వన్దిత్వ మహితానాం మధ్యే శ్రుతీనాం బాలిశా మమ స్తుతిః ॥**

దేవనాయకా!నీ సభలో నీ స్తుతిని చేసినందున గొప్పతనాన్ని పొందినవైన వేదాల నడుమ అజ్ఞుడనైన నా స్తుతి, సభలో వికటకవి పలికిన వాక్కు వలె, వినోదాన్ని ఇస్తుంది., కనుక అందరిచే, అంగీకరింపబడినది అవుతుంది.

**5) అమ్హ గురూణాం అచ్చుఅ జీహా సీహాసణమ్మి లద్ధ పఇట్ఠో ।**

**పడివాఇఅ పరమట్ఠో వారేసి అపణ్డిఅత్తణం అమ్హాణమ్॥**

**అస్మద్గురూణామచ్యుత జిహ్వాసింహాసనే లబ్ధప్రతిష్ఠః ।**

**ప్రతిపాదిత పరమార్థో వారయస్యపణ్డితత్వ మస్మాకమ్ ॥**

భక్తులను ఏనాడూ విడచిపెట్టని స్వభావాన్ని కల అచ్యుతా! నీవు మా ఆచార్యుల జిహ్వ అనే సింహాసనంలో స్థిరంగా నిలచి ఉండి, పరమార్థాలను తెలిపి, నా అజ్ఞానాన్ని తీరుస్తున్నావు.

**6) హిఅఏసు దేసిఆణం జణ్హాయి లహరీసు పుణ్ణచన్దో ఇవ్వ ఫుడో ।**

**కలుసజలేసు వ హంసో కసాఅ కబురేసు ఠాసి అచ్చుఅ ణ ఖణమ్ ॥**

**హృదయేషు దేశికానాం  జాహ్నవీ లహరీషు పూర్ణ చన్ద్ర ఇవ స్ఫుటః l**

**కలుష జలేష్వివ హంసః కషాయ కర్బురేషు తిష్ఠస్యచ్యుత న క్షణమ్ ॥**

అచ్యుతా! గంగాతరంగాలలో పూర్ణచంద్రునివలె ఆచార్యుల మనస్సులో స్వచ్ఛంగా వేంచేసి ఉన్నావు. కాలుష్యాన్ని(బురదను)కల నీటిలో హంస ఉండనట్లు, దోషాలు నిండుగా ఉండే చిత్తంలో నీవు కొంచెంసేపుకూడా ఉండవు.

**7) ఆఅమ మేత్త పమాణో ఆగోవిఅణం పఆస ణిఅ మాహప్పో l**

**సద్దహిఅ హిఅఅ సులహో దూరం ముఅసి ణఅసచ్చ డోలాఅన్తే॥**

**ఆగమమాత్రప్రమాణః ఆగోపీజనంప్రకాశ నిజ మాహాత్మ్యః l**

**శ్రద్ధిత హృదయసులభో దూరం ముఞ్చసి నతసత్య  డోలాయమానాన్॥**

నతసత్యా!వేదాన్నే నిన్ను తెలిపే ప్రమాణంగా కలవాడవై, గొల్లపిల్లలకుకూడా నీ గొప్పతనాన్ని వ్యక్తం చేసినవాడవై, నీపట్ల శ్రద్ధను కల మనస్సును కలవారికి సులభుడవై ఉండే నీవు చంచలమైన మనస్సును కలవారిని నీకు దూరంగా ఉంచుతావు.

.

8) సఇ ఖవిఅ సఅళ హేఅం సరణాగఅసచ్చ సచ్చ ణాణాణన్దమ్॥
ఉళ్ళంఘిఅ తివిహన్తం ఉవణిసఆణం సఆఇ గాఅన్తి తుమమ్॥

సదా క్ష పితసకలహేయం శరణాగతసత్య సత్యజ్ఞానానన్దమ్l
ఉల్లఙ్ఘిత త్రివిధాన్తమ్ ఉపనిషదాం శతాని గాయన్తి త్వామ్॥

శరణాగతులకు సత్యమైన స్వామీ!షవందలాది ఉపనిషత్తులు నిన్ను సదా ఏ దోషం లేనివాడవని, మార్పు లేనివాడవని(సత్యస్వరూపుడవని,) జ్ఞానానందస్వరూపుడవని, మూడు విధాలైన పరిచ్ఛేదాలను (పరిమితులను) లేనివాడవని పొగడుతున్నవి.

9) కుణసి ణ కీరసి కేణ వ ఠావేసి ణ సంఠవిజసి అణణ్ణ ఠి ఓl
హరసి ణిహిలం మ హీరసి అహిన్ద ణఅరిన్ద అణహ జోఇ ఫురన్తో॥

కరోషి న క్రియసే కేనాపి స్థాపయసి న సంస్థాప్యసేऽనన్యస్థితఃl
హరసి నిఖిలం న హ్రియసే అహీన్ద్రనగరేన్ద్రానఘ జ్యోతిస్స్ఫురన్॥

తిరువహీంద్రపురంలో వేంచేసి ఉండే స్వామీ! అడ్డు లేని సంకల్పరూపజ్ఞానాన్ని కలవాడవై గొప్పగా ప్రకాశించే నీవు, వేరు ఏ ఆధారాన్ని లేనివాడవు. అన్ని పదార్థాలను సృష్టిస్తున్నావు. నీవెవ్వరిచేత సృష్టింపబడడం లేదు.

అందరిని కాపాడుతున్నావు. నీవెవ్వరిచేత రక్షింపబడడం లేదు. జగత్తును లయం చేస్తున్నావు. నీవెవ్వరివల్ల లయాన్ని పొందడం లేదు.

10) అణు పమిఅస్స వి అచ్చుఅ సత్తీ తుహ సఅల ధారణాఇ వహుత్తాI
తేణ పడివత్థుపుణ్ణో సువ్వసి అపడిహఅ ణి అ ఠిఈ సవ్వగవోII

**అణుప్రమితస్యాప్యచ్యుత శక్తిస్తవ సకల ధారణాది ప్రభూతాI**
**తేన ప్రతి వస్తుపూర్ణః శ్రూయసేऽప్రతిహత నిజస్థితిః సర్వగతః II**

అచ్యుతా! అణువుగా ఉండే వస్తువులో నీవు ప్రవేశించి. ఉన్నా, నీ శక్తి సమస్తవస్తువులను ధరించడం మొదలైనవానిలో ఎక్కువగా ఉన్నది. అందువల్ల నీవు ఏ అడ్డు లేని స్థితిని కలిగినవాడవు, అంతటా వ్యాపించి ఉండేవాడవైన నీవు ప్రతివస్తువులోను నిండి ఉన్నవాడవుగా వేదాలలో చెప్పబడుతున్నావు.

11) సఅళాణ ధరణ నిఅమణ సామిత్తణ ణిఅమ సంఠిఓ సవ్వ తణూI
సువ్వసి అచ్చుఅ సవ్వో సఇ దంసిఅ కజ్జ కారణత్తణ కబురోII

**సకలానాం ధరణ నియమన స్వామిత్వ నియమ సంస్థితః సర్వతనుఃI**
**శ్రూయసేऽచ్యుత సర్వః సదా దర్శితకార్య కారణత్వ కర్బురః II**

అచ్యుతా!అన్ని వస్తువులను ధరిస్తావు., వాటిని నియమిస్తావు. వాటికి స్వామివై ఉంటావు. అన్నిటిని శరీరంగా కలవాడవై ఉంటావు. నీవే సూక్ష్మచిదచిత్తుల రూపంలో కారణంగా, స్థూలచిదచిత్తుల రూపంలో కార్యంగా ఉండేవాడవనే విషయాన్ని నీవే స్వయంగా తెలియజేశావు. అందువల్ల అన్నీ నీవే –అని వేదాలలో తెలుపబడుతున్నావు.

12) పరిస పహాణ సరీరో భువణాణం హోసి అచ్చుఅ ఉవా ఆణమ్।
ణిఅ సంకప్ప సణాహో వహసి ణిమిత్తత్తణం వి అమ్భుఅ సత్తీ॥

పురుష ప్రధానశరీరో భువనానాం భవస్యచ్యుతోపాదానమ్।
నిజ సఙ్కల్ప సనాథో వహసి నిమిత్తత్వ మప్యద్భుతశక్తిః ॥12॥

అచ్యుతా!విచిత్రమైన శక్తిని కల నీవు, జీవుని, ప్రకృతిని శరీరంగా కలవాడవై, లోకాలకు ఉపాదానకారణంగా అవుతున్నావు. సంకల్పంతో నిమిత్తకారణమవుతున్నావు.

13) విసమ గుణఙ్కార పఅరే జలం వ సామణ్ణకారణం తుహ కేళీ॥

ణి అ కమ్మ సత్తి ణిఅఆ అచ్చుఅ బమ్హాఇ ఠావరన్త విసేసా॥

విషమ గుణాఙ్కుర ప్రకరే జలమివ సామాన్యకారణం తవ కేళిః।

నిజకర్మశక్తినియతా అచ్యుత బ్రహ్మాది స్థావాన్త విశేషాః॥

వేర్వేరు అంకురాల (పుట్టుకల) సమూహానికి నీరు సామాన్యకారణమైనట్లు, వేర్వేరు గుణాలను కల జీవుల పుట్టుకకు నీ లీల సామాన్యకారణ మవుతున్నది. బ్రహ్మమొదలు స్థావరంవరకు గల వస్తువుల భేదాలు తమ కర్మల శక్తికి కట్టుబడి ఉంటాయి.

14) పురిసా తుజ్ఝ విహూఈః అచ్చుఅ లచ్ఛీఅ ఇత్థిఆ సణ్ణాఓ।

ణత్థి పరం తుజ్ఝాణం సా వి సిరీ హోఇ తుజ్ఝ కిం ఉణ ఇఅరమ్॥

పురుషా స్తవ విభూతిః అచ్యుత లక్ష్మ్యాః స్త్రీ సంజ్ఞాః।

నాస్తి పరం యువయోః సాపి శ్రీర్భవతి తవ కిం పున రితరత్॥

అచ్యుతా!లోకంలోని పురుషులు అందరు నీ విభూతి. స్త్రీలు అందరు లక్ష్మియొక్క విభూతి. మీ ఇద్దరికంటే వేరయినది ఏదీ లేదు. లక్ష్మినికూడా నీ సొత్తుగా కలిగి ఉన్నావు. ఇక, మిగిలినవానినిగూర్చి చెప్పాలా?

**15) ణహు తుహ సరిసబ్భహి ఆ ణాహ తుమం ఏవ్వ సవ్వ లోఅ సరణ్ణో।**

**ఏ ఆవ ణాణ సారం ఇఅ ముణిఉం తిఅసణాహ ఇఅర విఇన్తా॥**

**న ఖలు తవ సదృశాభ్యధికాః నాథ త్వమేవ సర్వలోక శరణ్యః।**

**ఏతావత్ జ్ఞానసారమితి జ్ఞాతుం త్రిదశనాథేతర విచిన్తా॥**

దేవనాయకా! నాథా! నీకు సమానులు, నిన్ను మించినవారు ఎవరూ లేరు. నీవే అన్ని లోకాలకు గొప్ప శరణం. తెలియదగిన జ్ఞానంలో సారం. ఇంత మాత్రమే. దీనిని తెలియడంకోసమే చేసే ప్రయత్నం అంతా.

**16) భాఇ ఫణీన్ద ఉరాహివ పడివాలేన్తేసు పాఅడ వహుత్త ఫలా।**

**అవి దుహిణ ప్పముహేహిం ఆణత్తీ తుహ అలఙ్ఘణిజ్జ పహావా॥**

**భాతి ఫణీన్ద్రపురాధిప ప్రతిపాలయత్సు ప్రకటప్రభూతఫలా।**

**అపి ద్రుహిణ ప్రముఖైః ఆజ్ఞప్తస్తవాలఙ్ఘనీయ ప్రభావా॥**

తిరువహీంద్రపురంలోని స్వామీ!నీ ఆజ్ఞ, ఎదురు చూచి వర్తించేవారికి గొప్ప ఫలాలను ఇచ్చేదిగా, బ్రహ్మ మొదలైనవారిచే అతిక్రమించడానికి వీలు కాని గొప్పతనాన్ని కలిగిదిగా ప్రకాశిస్తున్నది.

17) ణిఅమ విహీణ పఉత్తీ సవ్వాణ వి దాససచ్చ ఉద్దిసిఅ తుమమ్l
సద్ధ ణిమన్తిఅ బమ్హణ సమాహి సిద్ధం ళహన్తి తిఅసా భుత్తిమ్॥

**నియమవిధీనాం ప్రవృత్తిః సర్వేషామపి దాససత్యోద్దిశ్య త్వామ్l**
**శ్రాద్ధ నిమన్త్రిత బ్రాహ్మణ సమాది సిద్ధాం లభన్తే త్రిదశా భుక్తిమ్॥**

దాససత్యా! వేదాలు విధించే కర్మలన్నిటి అనుష్ఠానం నిన్ను ఉద్దేశించే చేయబడుతున్నది. పితృదేవతలు, శ్రాద్ధంలో వరింపబడిన బ్రాహ్మణులద్వారా లభించిన భుక్తిని (భోగాన్ని) పొంది తృప్తి పొందుతున్నారు. భోజనాన్ని సాక్షాత్తుగా భుజించిన బ్రాహ్మణులుకూడా తృప్తి పడుతున్నారు. అయితే, భోజనం మాత్రం పితృదేవతలను ఉద్దేశించే సమర్పింపబడుతున్నదికదా!. ఆ. విధంగానే, వైదికక్రియలలో సమర్పింపబడే హవిస్సును సాక్షాత్తు ఆ యా దేవతలు స్వీకరించి తృప్తిపడినా. అది వారికి అంతర్యామివి అయిన నిన్ను ఉద్దేశించే సమర్పింపబడుతున్నది. అందువల్ల అన్ని వైదికకర్మలకు ఉద్దేశ్యం నీవే.

**18) ఆరజ్ఞ తిఅస విలఏ అచ్చుఅ ణిచ్చం ణ ఠాసి జఇ ణామ తుమమ్I**

**కమ్మాణ కప్పిఆణం కాహీ కప్పన్తరేసు కో ణివ్వేసమ్॥**

**ఆరాధ్య త్రిదశ విలయేఽచ్యుత నిత్యం న తిష్ఠసి యది నామ త్వమ్I**

**కర్మణాం కల్పితానాం కరిష్యతి కల్పాన్తరేషు కో నిర్వేశమ్ ॥**

అచ్యుతా! ఆ యా కర్మలలో ఆరాధింపబడిన దేవతలకు నాశం కలిగినపుడు, నీవు ఎల్లప్పుడు ఉండకపోతే అనుష్ఠింపబడిన కర్మలకు ఫలాన్ని ఇవ్వడమనే పనిని వేరు కల్పాలలో ఎవరు చేస్తారు?(నీవు నిత్యంగా నిలచి ఉంటావు కనుక, కల్పాంతరాలలోకూడా ఆ యా జీవులు చేసిన కర్మల ఫలాలను అ యా జీవులకు ఇస్తావు)

**19) కప్పేసి కంఖిఆఇం కప్పదుమో వ్వ సిరి కఞ్చణ ల ఆ సహిఓI**

**ణఅసచ్చసఇ ఫలాఇం ణిఅ ఛాహి ణిహిణ్ణ ణిచ్చ తావ తిహువణో॥**

**కల్పయసి కాంక్షితాని కల్పద్రుమ ఇవ శ్రీకాఞ్చనలతాసహితఃI**

**నత సత్య సదా ఫలాని నిజచ్ఛాయా నిర్భిన్న నిత్య తాప త్రిభువనః॥**

దాససత్యా! శ్రీదేవి అనే మెరపు తీగతో కూడి ఉండే నీవు కల్పవృక్షంవలె నీ నీడతో ముల్లోకాల తాపాన్ని తీరుస్తూ, కోరిన ఫలాలను సదా ఇస్తున్నావు.

20) సఅలా అమాణ ణిట్ఠాసఅళసురాణం వి అన్తరో అప్పాణో।
సఅళ ఫళాణ పసూఈ సఅళ జణాణం సమో ఖు ణఅసచ్చ తుమమ్॥

సకలాగమానాం నిష్ఠా సకలసురాణా మప్యన్తర ఆత్మా।
సకల ఫలానాం ప్రసూతిః సకల జనానాం సమః ఖలు నతసత్య త్వమ్॥

నతసత్యా! నీవు అన్ని వేదాలకు అవధియై ఉన్నావు. అందరు దేవతలకు అంతర్యామివై ఉన్నావు. అన్ని ఫలాలను ప్రసవించేవాడవై (ఇచ్చేవాడవై) ఉన్నావు. ప్రాణులందరి విషయంలో సమంగా వర్తించేవాడవై ఉన్నావు.

21) ఇఅ సవ్వాణ సమాణో సచ్చఠిఓ దాససచ్చ సఇపరిపుణ్ణో।
కహ వహసి పక్ఖ వాఅం పణ్డవ పముహేసు పేసణం వి సహన్తో ॥

ఇతి సర్వేషాం సమానః సత్యస్థితో దాససత్య సదా పరిపూర్ణః॥
కథం వహసి పక్షపాతం పాణ్డవ ప్రముఖేషు ప్రేషణమపి సహమానః॥

దాససత్యా! ఈ విధంగా అందరి విషయంలో సముడవై, సత్యంలోనే నిలకడను కలవాడవై, సదా పరిపూర్ణుడవై ఉండే నీవు, పాండవులు మొదలైనవారు నిన్ను దూతగా పంపడాన్నికూడా సహించి, వారిపట్ల నీ పక్షపాతాన్ని ఏ విధంగా చూపించావు?

**22) విసమమ్మి కమ్మమగ్గే విపరి ఖలన్తాణ విబ్భలిఅ కరణాణమ్l**

**ణాహ ణిహిలాణ అణ్ణో ణత్థి తుమాహి ణఅసచ్చ హత్థాళమ్బో॥**

**విషమే కర్మమార్గే విపరిష్ఖలతాం విహ్వలిత కరణానామ్l**

**నాత నిఖిలానా మన్యో నాస్తి త్వన్నతసత్య హస్తాలమ్బః॥**

నతసత్యా! సర్వేశ్వరా! విచిత్రమైన కర్మల మార్గంలో తడబడేవారై, తల్లడిల్లే ఇంద్రియాలను కలవారికి అందరికి చేయూతను ఇచ్చేవారు లోకంలో నీవు తప్ప ఇంకెవ్వరూ లేరు.

**23) ణఅస్స కో అవిసఓ అచ్చుఅ కలుణాఅ తుజ్ఝ కో దూరఠిఓl**

**సత్తీఅ కో అఇభరో తా ఖు ఉవాఓ తుమం చిఅ సఅం సిద్ధో ॥**

**జ్ఞానస్య కోఽవిషయో అచ్యుత కరుణాయా స్తవ కో దూరస్థితః ।**

**శక్తేః కోఽతిభరః తస్మాత్ ఖలూపాయ స్త్వమేవ స్వయం సిద్ధః ॥**

అచ్యుతా!నీ జ్ఞానానికి విషయం కాని వస్తువు ఏదీ లేదు. నీ కరుణకు దూరంలో ఉండేవాడెవడూ లేడు. నీ శక్తికి మిక్కిలి భారమైనది ఏదీ లేదు. అందువల్ల నీవే స్వయంగా సిద్ధించిన ఉపాయమై ఉన్నావు.

**24) సంకప్ప కణ్ణహారో కింకరసచ్చ భవసాఅరే అఇగహిరే ।**

**అణహో తుమం ఖు పో ఓ అప్పాణ కివా సమీరణేణ పఉత్తో॥**

**సఙ్కల్ప కర్ణధారః కిఙ్కరసత్య భవసాగరేఽతిగభీరే ।**

**అనఘస్త్వం ఖలు పోతః త్మనాం కృపా సమీరణేన ప్రయుక్తః॥**

వతసత్యా! నీవు, జీవులకు చాలా లోతైన సంసారమనే సముద్రంలో నీ సంకల్పంతోనే నావచుక్కానిని నడపేవాడవై, నీ కరుణ అనే గాలితో గెంటబడే, ఏ లోపం లేని నావగా కూడా అవుతున్నావు.

**25) అచ్చుఅ ణ దేన్తి మోక్ఖం ఈసర భావేణ భావిఆ ఇఅరసురా।**

**రత్తిం పరవట్టే ఉం లక్ఖం ఆలేక్ఖ దిణ అరాణ వి ణ ఖమమ్॥**

**అచ్యుత న దదతి మోక్షమ్ ఈశ్వరభావేన భావితా ఇతర సురాః।**

**రాత్రిం పరివర్తయితుం లక్ష్మమాలేఖ్య దినకరాణామపి న క్షమమ్॥**

అచ్యుతా!ఈశ్వరులని భావింపబడే అన్యదైవాలు మోక్షాన్ని ఇవ్వలేరు. చిత్రంలో రాయబడిన సూర్యుని గుర్తు (బొమ్మ) రాత్రిని మార్చలేదు.

**26) అమఅ రస సాఅరస్సవ అహీన్ద ఉర ణాహణిమ్మలమహగ్ఘాఇమ్॥।**

**తీరన్తి ణ విగణే ఉం అణణ్ణసుల్హా ఇ తుజ్ఝ గుణ రఅణాఇమ్॥**

**అమృతరస సాగరస్యేవ అహీన్ద్రపురనాథ నిర్మలమహార్ఘాణి।**

**తీర్యన్తే న విగణయితుమ్ అనన్య సులభాని తవ గుణరత్నాని॥**

తిరువహీంద్రపురంలో వేంచేసి ఉండే స్వామీ!అమృతరసమయమైన సముద్రంవంటి నీలో నీలో ఉండే నిర్మలమైన, అమూల్యమైన, వేరెవ్వరికీ పొందడానికి సాధ్యం కాని గుణాలనే రత్నాలు లెక్కలేనివి.

27) భూసిఅ సుఇ సీమన్తో భుఅఇన్ద ఉరేస సవ్వగుణ సీమన్తో l
ఖవిఅ తిసా మళ మోహో ముణీణ హిఅఏసు ఫురసి సామళ మోహో॥

**భూషితశ్రుతి సీమన్తో భుజగేన్ద్ర పురేశ సర్వగుణసీమాన్తః l**
**క్షపిత తృషామలమోహో మునీనాం హృదయేషు స్ఫురసి శ్యామళమయూఖః॥**

తిరువహీంద్రపురంలోని స్వామీ! వేదమాత పాపిడిని (సీమంతాన్ని) అలంకరించేవాడవై, గుణాలన్నిటికి పరమావధియై, ఆశను, పాపాన్ని, మోహాన్ని పోగొట్టేవాడవై, నల్లని కాంతిని కలవాడవైన నీవు మునివరుల హృదయాలలో వెలుగుతున్నావు.

28) సుహ లక్షణ సిఖిచ్ఛో సోహసి ణిమ్మత్త విరహ ఖణ సిఖిచ్ఛోl
రణదేవణ సవిహగఓ ఉద్ధణ గలులణఇ తీర వణ సవిహ గఓ॥

**శుభలక్షణ శ్రీత్సః శోభసే నిర్ముక్త విరహ క్షణ శ్రీవత్సఃl**

**రణదేవన సవిహగః ఉద్భట గరుడనదీ తీరవనసవిధగతః॥**

శ్రీవత్సమనే పుట్టుమచ్చను అందమైన గుర్తుగా కలవాడవై, క్షణంకూడా విడచి ఉండని లక్ష్మిని వక్షస్సులో కలవాడవై, రణక్రీడలలో ముందుండేవాడవైన నీవు కూలంకషంగా (ఒడ్డును ఒరసికొని)ప్రవహించే గరుడనదీతీరంలో గల వనంలో సమీపంలో ఉండే గజంగా వెలుగుతున్నావు

**29) అకుమార జోవ్వణ ఠిఅం అహిన్ద ఉరణాహ అహిమఅం అణురూవమ్l**

**ణిచ్చం సహావ సిద్ధం సువ్వఇ సూరి మహిఅం సుహం తుహ రూవమ్॥**

**అకుమార యౌవనస్థితమ్ అహీన్ద్రపురనాథాభిమత మనురూపమ్l**

**నిత్యం స్వభావసిద్ధం శ్రూయతే సూరిమహితం  సుఖం తవ రూపమ్॥**

తిరువహీంద్రపురంలోని స్వామీ! నీ తిరుమేని కుమారభావాన్ని లేని యౌవనాన్ని స్థిరంగా కలిగి ఉన్నదై, శాశ్వతమైనదై, నీ నిత్యసంకల్పంచేత నిత్యంగా ఉండేదై, నీకు తగినదై, నీ మనస్సుకు నచ్చినదై, నిత్యసూరులచే స్తుతింపబడేదై, సుఖరూపమై ఉంటుంది.

**30) తిఉణం తస్స విఆరా అచ్చుఅ పురిసోత్తి ఆఅమ గణిజ్జన్తా।**

**అత్థా తుహ ఖు సమత్థా పరమ్మి రూపమ్మి భూసణత్థ సరూవా॥**

**త్రిగుణం తస్య వికారాః అచ్యుతపురుష ఇత్యాగమగణ్యమానాః।**

**అర్థాస్తవ ఖలు సమస్తాః పరస్మిన్ రూపే భూషణాస్త్ర స్వరూపాః॥**

అచ్యుతా! సత్త్వం, రజస్సు, తమస్సు –అనే మూడు గుణాలను కల ప్రకృతి., దాని పరిణామరూపాలైన మహాన్, అహంకారం మొదలైనవి, జీవుడు అని శాస్త్రాలలో లెక్కింపబడే వస్తువులన్నీ నీ పరవాసుదేవరూపంలో దివ్యాభరణాలుగా, దివ్యాయుధాలుగా ఉన్నాయి.

**31) ణిన్తి తుమాఓ అచ్చుఅ ణిక్ఖవిఅ విపక్ఖ ణిట్ఠుర పరక్కమణా।**

**సంఠవిఅ పరమ ధమ్మా సాహు పరిత్తాణ సప్ఫలా ఓఆరా॥**

**నిర్యాన్తి త్వత్తోఽచ్యుత నిక్షపిత విపక్ష నిష్ఠుర పరాక్రమణాః॥**

**సంస్థాపిత పరమ ధర్మాః సాధు పరిత్రాణ సత్ఫలా అవతారాః॥**

అచ్యుతశతకమ్

అచ్యుతా! క్రూరులైన శత్రువులను సంహరించడంద్వారా నీ పరాక్రమాన్ని వ్యక్తం చేసినవి, గొప్ప ధర్మాన్ని సుస్థాపించినవి, మంచివారిని కాపాడడమే ముఖ్యఫలంగా కలిగినవి అయిన పలు అవతారాలు నీనుండి వ్యక్తమయ్యాయి

.

**32) హరి మణి సరిచ్ఛణి ణిఅ రుఇ హరిఆఅన్త భుఅఇన్ద వుర పేరన్తో l**
**కాలే దాస జణాణం కణ్హా ఘణో హోసి దిణ్ణ కాలుణ్ణ రసో॥**

**హరిమణిసదృక్ష నిజరుచి హరితాయమాన భుజగేన్ద్రపుర పర్యన్తః l**
**కాలే దాసజనానాం కృష్ణఘనో భవసి దత్త కారుణ్యరసః॥**

అచ్యుతా! ఇంద్రనీలమణితో పోలిన నీ పచ్చని కాంతి తిరువహీంద్రపుర సమీపంలోని ప్రదేశాలను పచ్చని రంగును కలిగినవిగా చేస్తున్నది, తగిన కాలంలో కరుణాజలాన్ని భక్తజనులకు వర్షించే నీలమేఘంవలె నీవున్నావు

**33) గలుల ణఇ కచ్ఛరణ్ణోలక్ఖిజ్జసి లచ్ఛి మహి కణేరు మణహరో l**
**దీసన్త బహుళ దాణో దిసా గఇన్దో వ్వ ఖుడిఅ దణుఇన్ద దుమో॥**

**గరుడనదీ కచ్ఛారణ్యే లక్ష్యసే లక్ష్మీ మహీ కరేణుమనోహరః l**

**దృశ్యమాన బహుళదానో దిశాగజేన్ద్ర ఇవ ఖణ్డిత దనుజేన్ద్ర ద్రుమః॥**

అచ్యుతా! గరుడనదీతీరంలోని వనంలో విహరించే దిగ్గజంవలె నీవున్నావు. గజం అడవిలోని వృక్షాలను భగ్నం చేసేటట్లే, నీవుకూడా వృక్షాలవంటి అసురులను భగ్నం చేశావు. గజం దానజలమనే మదజలాన్ని స్రవిస్తుంది. నీవు నీ భక్తులకు వారు కోరినవానిని పుష్కలంగా దానమిస్తావు. గజం ఆడ ఏనుగులతో కలసి సంచరిస్తుంది నీవుకూడా శ్రీదేవి, భూదేవులతో కలసి విహరిస్తావు.

**34) ముహచన్ద మోళి దిణఅర మజ్ఝ ఠిఓ తుజ్ఝ చిఉర భారన్ధారో।**

**అఘుడిఅ ఘుడణా సత్తిం సచ్చం ఠావేఇ దాససచ్చ సమగ్గమ్॥**

**ముఖచన్ద్ర మౌళి దినకర మధ్యస్థిత స్తవ చికురభారాన్ధకారః।**

**అఘటిత ఘటనా శక్తిం స్థాపయతి దాససత్య సమగ్రామ్॥**

దాససత్యా! నీ ముఖమనే చంద్రునకు, కిరీటమనే సూర్యునకు మధ్యలో ఉండే కేశపాశమనే చీకటి నీ అఘటితఘటనాసామర్థ్యాన్ని (ఒకచోట కూడి ఉండే అవకాశం లేని వస్తువులను ఒకచోట చేర్చగల సామర్థ్యాన్ని) అంతటిని నిరూపిస్తున్నది. ఇది నిజం

**35) పరిహాసిఅ పుణ్ణచన్దం పుమసరిచ్ఛ ప్పసణ్ణ లోఅణ జుఅళమ్।**

సంకప్పిఅ దురిఆఇ వి సమ్భరిఅం హరఇ దాససచ్చ తుహ ముహమ్॥

పరహసిత పూర్ణచన్ద్రం పద్మ సదృక్ష ప్రసన్న లోచన యుగళమ్l

సఙ్కల్పిత దురితాన్యపి సంస్మృతం హరతి దాససత్య తవ ముఖమ్ ॥

దాససత్యా! పూర్ణచంద్రుని పరిహసిస్తున్నది, తామరతో పోలినది, వికసించిన రెండు కన్నులను కలిగినది అయిన నీ ముఖాన్ని స్మరిస్తే, తెలిసి చేసిన పాపాలుకూడా నశించి పోతాయి.

36) మాహప్పం తుహ మహిఅం మఙ్గళిఅం తుళసి కోత్థుహ ప్పముహాణమ్l

అచ్చుఅ థిర వణమాళం వచ్ఛం దంసేఇ సచ్ఛి లక్ఖణ సుహఅమ్॥

మాహాత్మ్యం తవ మహితం మాఙ్గలికం తుళసీ కౌస్తుభ ప్రముఖానామ్l

అచ్యుత స్థిరవనమాలం వత్సం దర్శయతి లక్ష్మీలక్షణ సుభగమ్॥

అచ్యుతా!లక్ష్మీదేవితో, శ్రీవత్సమనే పుట్టుమచ్చతో. అందంగా ఉన్నది, తులసీమాల, కౌస్తుభరత్నం మొదలైనవానికికూడా మంగళత్వాన్ని కలిగించేది, వనమాలను సదా ధరించేది అయిన నీ వక్షఃస్థలం గొప్పదైన నీ మహత్వాన్ని తెలుపుతున్నది.

37)ణివ్విసఇ ణిచ్చతావో దేవఅణో దేవణాఅఅ విహి ప్పముహోl

సీఅళసన్త వహుత్తం ఛాహిం తుహ విఉళబాహు కప్ప దుమాణమ్॥

నిర్విశతి నిత్యతాపో దేవజనో దేవనాయక విధి ప్రముఖఃl

శీతల శాన్త ప్రభూతాం ఛాయాం తవ విపుల బాహు కల్ప ద్రుమాణామ్॥

దేవనాయకా! బ్రహ్మమొదలైన దేవతల సమూహం నీ విశాలమైన బాహువులనే కల్పవృక్షంయొక్క చల్లని, దట్టమైన, విశాలమైన నీడను తాపం తొలగినదై, అనుభవిస్తున్నది.

38) సంకప్పచన్ద ఖోహిఅ తిఉణోఅహి విఉఅ బుబ్బుఅ ప్పఅరేహిమ్l

బమ్హణ్డేహి వి భరిఅం కిఙ్కరసచ్చ తుహ కీస ణు కిసం ఉ అరమ్॥

సఙ్కల్ప చన్ద్ర క్షోభితత్రిగుణోదధి విపులబుద్బుద ప్రకరైఃl

బ్రహ్మాణ్డైరపి భరితం కిఙ్కరసత్య తవ కస్మాన్ను కృశముదరమ్॥

దాససత్యా! నీ సంకల్పమనే చంద్రునిచే కలతను పొందిన ప్రకృతి అనే సముద్రంలోని విపులమైన, నీటి బుడగల సమూహంవంటి బ్రహ్మాండాలతో నిండి ఉన్నా నీ ఉదరం ఇంకా ఎందువల్ల కృశించి ఉన్నది?

39) ణాహిరుహం తుహణళిణం
భుఅఈసరణఅరణాహ సోహఇ సుహఅమ్।
మజ్ఝ ఠిఅ బమ్హ భమరం
వాఇచ్ఛాసణ లచ్ఛి పాఅ వీఢ సరిచ్ఛమ్॥

**నాభిరుహం తవ నళినం**
**భుజగేశ్వర నగరనాథ శోభతే సుభగమ్।**
**మధ్యస్థిత బ్రహ్మ భ్రమరం**
**వత్సాసన లక్ష్మీపాదపీఠసదృక్షమ్॥**

తిరువహీంద్రపురనాథా! చాలా అందమైనది నడుమ. ఉన్న బ్రహ్మ అనే తుమ్మెదను కలిగినది, నీ నాభిలో పుట్టినది అయిన నీ నాభీపద్మం నీ వక్షఃస్థలంలో ఉండే లక్ష్మీదేవి పాదానికి పీఠమై వెలుగుతున్నది.

40) దిఢ పీడిఅ మహు కఢ్వ సోణిఅ పడల పరిపాడలమ్బర ఘడిఆ।

**రాఅఇ అచ్చుఅ ముహలా రఇణాహ గఇన్ద సింఖలా తుహ రసణా॥**

**దృఢపీడిత మధుకైటభ శోణిత పటల పరిపాటలామ్బర ఘటితా।**

**రాజత్యచ్యుతముఖరా రతినాథ గజేన్ద్ర శృంఖలా తవ రశనా॥**

అచ్యుతా!ఎక్కువగా పీడింపబడినవారైన మధుకైటభులనే అసురుల రక్తసమూహంతో తడిసి, చాలా ఎర్రగా ఉండే పీతాంబరం పైన అలంకరించుకొన్నది, మధురంగా ధ్వనించేది అయిన నీ మొలనూలు, మన్మథుడనే పెద్ద ఏనుగును బంధించే సంకెలవలె ప్రకాశిస్తున్నది.

**41) దాసాణ సచ్చ దీసఇ దాణవ వీరాణ దీహ ణిద్దా సఅణమ్।**

**తుహ ఉఅరిత్థిఅ తిహువణ పాసాఅక్ఖమ్భ సచ్ఛఅం ఊరుజుఅమ్॥**

**దాసానాం సత్య దృశ్యతే దావనవీరాణాం దీర్ఘనిద్రా శయనమ్।**

**తవోదరస్థిత త్రిభువన ప్రాసాద స్తమ్భ సచ్ఛాయ మూరుయుగమ్॥**

దాససత్యా!అసురవీరులకు మరణశయ్య అయిన నీ ఊరువుల జంట నీ ఉదరంలో ఉండే ముల్లోకాలనే భవనానికి స్తంభాలవలె గోచరిస్తున్నది.

42) జాణు మణి దప్పణేణ అ జఙ్ఘా మరగఅ కళాఇఆఏ అ ఘణి ఆl
అచ్చుఅ ణ ముఅఇ కన్తీ లచ్ఛీ వ సరోఅ లఞ్ఛణే తుహ చళణేll

జానుమణి దర్పణేన చ జఙ్ఘా మరకత కలాచికయా చ ధన్యాl
అచ్యుత న ముఞ్చతి కాన్తిః లక్ష్మీరివ సరోజలాఞ్ఛనౌ తవ చరణౌll

అచ్యుతా! నీ మోకాళ్ళు అనే రత్నపుటద్దంవల్ల, కాలి పిక్కలనే, మరకతమణులతో చేసిన కలాచికా అనే తాంబూలపాత్రవల్ల గొప్పగా ప్రకాశించే కాంతి, తామరపూవును వదలి ఉండని లక్ష్మీదేవివలె, తామరపూవు గుర్తును కల నీ పాదాలను విడువడం లేదు.

43) సుఇ సీమన్త పసూణం సోహఇ ణఅసచ్చ తుజ్జ సవ్వ సరణ్ణమ్l
కమణ ఖణ జణిఅ సుర ణఇ పసమిఅ తేల్లోక్క పాఅఅం పఅ పఉమమ్ll

శ్రుతి సీమన్త ప్రసూనం శోభతే నతసత్య తవ సర్వశరణ్యమ్l
క్రమణక్షణజనిత సురనదీ ప్రశమిత త్రైలోక్య పాతకం పదపద్మమ్ll

నతసత్యా! లోకాలను కొలిచే సమయంలోనే నీ పాదపద్మంనుండి పుట్టిన దేవగంగ ముల్లోకాల పాపాన్ని పోగొట్టింది. ఆ పాదపద్మం వేదశిరస్సును అలంకరించే పుష్పంగా, అందరిని కాపాడే గొప్ప శరణంగా శోభిస్తున్నది. (నీ పాదాల మహిమ వేదంలో తెలుపబడింది.. అది అందరికి రక్షకం)

**44) ఇఅ తిహువణేక్కమూళం ఆసాదేన్తి అణహా అమఅసా ఉరసమ్l**

**ఓసహి మహిహర పాసే ఉఇఅం తుం ఓసహిం వ దాస రుఆణమ్॥**

**ఇతి త్రిభువనైకమూలమ్ ఆస్వాదయన్త్యనఘా అమృతస్వాదురసమ్l**

**ఓషధి మహీధరపార్శ్వ ఉదితం త్వామోషధి మివ దాసరుజామ్॥**

ఏ దోషం లేని భక్తులు, నిన్ను , ఔషధాద్రికి సమీపంలో ఆవిర్భవించినవాడవని, ముల్లోకాలకు అద్వితీయమైన మూలమని, అమృతంవలె భోగ్యమైనవాడవని, భక్తుల వ్యాధిని పోగొట్టే మూలికవని భావిస్తున్నారు.

**45) సిద్ధఙ్గణం వ సామం తుజ్ఝ తణుం ణి అ విలోఅణేసు ఖివన్తా l**

**అచ్చుఅ లచ్ఛి ణివాసం ణిచ్చ ణిఊఢం ణిహిం వ పేచ్ఛన్తి తుమమ్॥**

**సిద్ధాఞ్జనమివ శ్యామాం తవ తనుం నిజవిలోచనేషు క్షిపన్తః॥**

**అచ్యుతలక్ష్మీనివాసం నిత్యనిగూఢం నిధిమివ పశ్యన్తి త్వామ్॥**

అచ్యుతా! నల్లని రంగును కల నీ మేనిని,, సిద్ధుల అంజనం(కాటుక)వలె, తమ కన్నులలో నిలుపుకొనే మహనీయులు లక్ష్మికి (సంపదకు) నివాసస్థానమై, ఎల్లప్పుడు నిగూఢంగా ఉండే నిన్ను నిధినివలె దర్శిస్తున్నారు.

**46) విహడిఅ ణిబిడన్ధారో ఘుడన్త జోఈ తిలోఅ ఏక్క గహవఈ|**

**దిట్ఠి గఓ జాణ తుమం ణమన్తసచ్చ ణ హుతాణ మోహ తఆమా॥**

**విఘటిత నిబిడాన్ధకారో ఘటమాన జ్యోతిస్త్రిలోకైక గ్రహపతిః॥**

**దృష్టిగతో యేషాం త్వం నమత్సత్య న ఖలు తేషాం మోహత్రియామా॥**

నతసత్యా!అజ్ఞానమనే దట్టమైన చీకటిని పోగొట్టేవాడవై, ప్రకాశించే జ్ఞానజ్యోతిని కలవాడవై, అందువల్ల ముల్లోకాలకు సాటి లేని సూర్యుడవైన నీవు, ఎవరి దృష్టికి గోచరిస్తావో, వారికి అజ్ఞానమనే రాత్రి ఉండదుకదా!

**47) విసఅ రసమ్మి విరత్తా విఆర జణణేహి వి ణ హు వికీరన్తా l**

**జీవన్త ముక్క సరిసా అచ్చుఅ దీసన్తి పావణా తుహ భత్తా॥**

**విషయరసే విరక్తాః వికారజననైరపి న ఖలు విక్రియమాణాఃl**

**జీవన్ముక్త సదృశా అచ్యుత దృశ్యన్తే పావనాస్తవ భక్తాః॥**

అచ్యుతా!నీ భక్తులు అల్పానందానుభవంలో ఆశను లేనివారై మనస్సులో వికారాన్ని కలిగించే వస్తువులతో తమ మనస్సులో మార్పును పొందనివారై మిక్కిలి పవిత్రులై, ఈ లోకంలోనే ముక్తిని పొందినవారివలె దర్శనమిస్తున్నారు.

**48) గన్ధవ్వణఅర సిమిణఅ సారిచ్ఛాణం సిరీణ వణ సరిఆణమ్l**

**ణ సమురఇ తుమ్హ గహిఓ సరణాగఅ సచ్చ సఇమఓ జీఅగఓ॥**

**గన్ధర్వనగర స్వప్న సదృక్షాణాం శ్రియాం వన సరితామ్l**

**న స్మరతి త్వద్గృహీతః శరణాగత సత్య సదామదో జీవ గజః॥**

శరణాగతసత్యా! సదా గర్వాన్ని పొందిన జీవుడనే గజం నీచే పట్టుకోబడినదై, గంధర్వనగరంవంటి(ఆకాశంలో మేఘాలు కొన్ని సమయాలలో ఏనుగువలె, గుర్రంవలె, ఇంకా పలు రూపాలలో కనిపిస్తాయి. వీటికే గంధర్వనగరమని,

మేఘచిత్రమని పేరు) స్వప్నంవంటి, నిలకడ లేని సంపదలనే ఎండమావులనుగూర్చి భావించదు.

49) ణమహేన్తి ణాణవన్తా తరఙ్గ డిణ్డీర బుబ్బుఅ సరిచ్ఛాఇమ్l
విహి పముహాణ పఆఇం ఘణ కన్దళి కన్ద కఅళి ఖమ్భ సమాఇమ్॥

న మహయన్తి జ్ఞానవన్తః తురఙ్గడిణ్డీర బుద్బుద సదృక్షాణిl
విధి ప్రముఖానాం పదాని ఘన కన్దలి కన్దకదలీ స్తమ్భ సమాని॥

జ్ఞానులు అలలను, నురగలను, నీటి బుడగలను పోలినవి, (అశాశ్వతమైనవి) మేఘాన్ని కందళిదుంపను, అరటి బోదెలను పోలినవి, (అసారమైనవి) అయిన బ్రహ్మాదుల పదవులను లెక్కించరు.

50) పుళఇఅ స పర సహావా పురిసా ఘేత్తూణ సామిణో తుహసీళమ్l
ణాహ ణఅసచ్చ సఘిణా ణ ముఅన్తి కహం వి సవ్వజణసోహద్దమ్॥

దృష్ట స్వపర స్వభావాః పురుషా గృహీత్వా స్వమిన స్తవ శీలమ్l
నాథ నతసత్య సఘృణాః న ముఞ్చన్తి కథమపి సర్వజనసౌహార్దమ్॥

నాథా!శనతసత్యా! చిత్తు, అచిత్తు, ఈశ్వరుడనే మూడు తత్త్వాల జ్ఞానాన్ని కల మహనీయులు, నాయకుడవైన నీ స్వభావాన్ని పురస్కరించుకొని (చూచి) కరుణతో కూడిన, అందరిపట్ల మంచిని తలచే ప్రవర్తనను ఏనాడూ విడచిపెట్టరు.

51) మాణ మ ఏసా మచ్ఛర డమ్భాసూఆ భూ ఆ మరిస లోహ ముహాl
దీసన్తి ణ మోహ సుఆ దోసా దాసాణ సచ్చ తుహ భత్తాణమ్॥
**మానమదేర్ష్యా మత్సరదమ్భాసూయా భయామర్షలోభముఖాఃl**
**దృశ్యన్తే న మోహసుతాః దోషా దాసానాం సత్య తవ భక్తానామ్॥**

దాసనత్యా! నీ భక్తులలో మోహంవల్ల కలిగే అహంకారం, గర్వం, ఈర్ష్య, మాత్సర్యం, దంభం, అసూయ, భయం, కోపం, ఆశ మొదలైన దుర్గుణాలు ఏవీ ఉండవు.

52) జాణ మఈ ఇఅర ముహీ కాళో సఅళో వి తాణ కలి విత్థారో l
జే తుహ పఅమ్మి పవణా ణత్థి కలీ ణఅవఇ ణఅర వఇ తాణమ్॥

**యేషాం. మతి రితరముఖీ కాలః సకలోऽపి తేషాం  కలి విస్తారః॥**

**యో తవ పదే ప్రవణాః నాస్తి కలి ర్నాగపతి  నగరపతే తేషామ్॥**

తిరువహీంద్రపురస్వామీ!ఎవరి బుద్ధి లౌకికవిషయాలలో ఆసక్తిని కలిగి ఉన్నదో, వారికి కాలమంతా కలియుగవిస్తారమే అవుతుంది. ఎవరు నీ పాదాలలో ప్రావణ్యాన్ని(భక్తిని) కలిగి ఉంటారో వారికి కలియుగమనేదే లేదు.

**53) అచ్చాసణ్ణ విణాసా అచ్చుఅ పేచ్ఛన్తి  తావఏ భత్తఅణే l**

**మోక్ఖ రుఈణ సుమగ్గే మూఢా దిఅహా అర మణ్డలమ్మి వ ఛిద్దమ్॥**

**అత్యాసన్నవినాశాః అచ్యుత పశ్యన్తి తావకే భక్తజనేl**

**మోక్షరుచీనాం సుమార్గే  మూఢా దివసకర  మణ్డల ఇవ ఛ్ఛిద్రమ్॥**

అచ్యుతా! ముముక్షువులకు సూర్యుడు మోక్షమార్గమైనట్లు నీ భక్తుల సంబంధంకూడా మోక్షానికి మార్గం. కాని, నశించే కాలం దగ్గర పడిన అజ్ఞానులు నీ భక్తులలో దోషాన్ని భావిస్తారు. నీ భక్తులలో దోషాన్ని చూడడం ఏ దోషం లేని సూర్యునిలో దోషాన్ని చూడడంవంటిది. చేటుకాలం దగ్గర పడినవారు, సూర్యునిలో దోషాన్ని చూచినట్లు నీ భక్తులలో దోషాన్ని భావిస్తారు

**54) ణితుడిఅ దుమ్మాణ ఘణా ణిమ్మల గుణ ఘడిఅ తారఆ పబ్భారాl**

**భాసన్త భత్తి జోణ్హా ణఅసచ్చ ఫురన్తి ణహ ణిహా తుహ భత్తా॥**

**నిత్రుటిత  దుర్మాన ఘనాః నిర్మల గుణఘటిత తారకా ప్రాగ్భారాఃl**

**భాసమాన భక్తి జ్యోత్స్నాః నతసత్య స్ఫురన్తి  నభో నిభాస్తవ  భక్తాః॥**

నతసత్యా! నీ భక్తులు –దురహంకారమనే మేఘం తొలగిన, నిర్మలగుణాలనే నక్షత్రసమూహాన్ని కలిగిన, వెలిగే భక్తి అనే వెన్నెలను కల ఆకాశంవంటివారై ప్రకాశిస్తారు.

**55) ణహు జమ విస అమ్మి గఈ ణఅసచ్చ పఅమ్బుఅంతుహ పవణ్ణాణమ్l**

**ఖలిఆణ వి జహ జోగ్గం  సిక్ఖా సుద్ధన్త కింకరాణ వ లహుఈ॥**

**న ఖలు  యమవిషయే గతిర్నతసత్య పదామ్బుజం  తవ ప్రపన్నానామ్l**

**స్ఖలితానామపి  యథాయోగ్యం  శిక్షా శుద్ధాన్త కింకరాణామివ లఘ్వీ॥**

నతసత్యా! నీ చరణపద్మాన్ని శరణు పొందినవారికి యమలోకానికి వెళ్ళనక్కరలేదుకదా! తొట్రుపాటు పడినవారికికూడా(గతంలో వారు తప్పు చేసినా), అంతఃపురంలోని సేవకులకువలె, దండన తగిన రీతిలో చిన్నదిగానే ఉంటుంది. (నీ భక్తులు ప్రమాదవశంచేత తప్పు చేసినా, వారిని స్వల్పంగానే శిక్షిస్తావు)

**56) కమ్మ గఇ దోస దిహిఆ కఅన్త భిఉడీ భుఅఙ్గీ దంసమ తత్థా।**

**అచ్చన్తి తుజ్ఝ చళణే అచ్చుఅ పబ్భ వమ్మహ రసాసాఆ॥**

**కర్మగతి దోష దుఃఖితాఃకృతాన్తభ్రుకుటీ భుజఙ్గీ దర్శనత్రస్తాః।**

**అర్చన్తి తవ చరణౌ అచ్యుత ప్రభ్రష్ట మన్మథ రసాస్వాదాః॥**

అచ్యుతా!కర్మల గతిలో(కర్మాచరణలో) ఏర్పడిన దోషాలవల్ల దుఃఖాన్ని పొంది, యముని కనుబొమలు అనే ఆడసర్పాన్ని చూచినందున భయపడినవారు కామభోగాల అనుభవంలో ఆశను పోగొట్టుకొన్నవారై, నీ చరణాన్ని ఆరాధిస్తారు

**57) ఆలగ్గఇ హ తుహ చళణే అచ్చుఅ విహిణా వి అచ్చణా ఆఅరిఆ।**

**జా ఏక్కన్తి పడత్తా సేసం వ సఅం సిరేణ పడి గేణ్హసి తమ్॥**

**ఆలగతి తవ చరణౌ అచ్యుతవిధినాऽప్యర్చనాऽऽచరితా।**

**శేషామివ స్వయం శిరసా ప్రతిగృహ్ణాసి తాం॥57॥**

అచ్యుతా!బ్రహ్మచే చేయబడిన అర్చనకూడా. నీ చరణాలవద్దకే చేరుతున్నది. పరమైకాంతులు చేసే అర్చనను మాత్రం నీవు పరివేష్ఠనాన్నివలె (పరివట్టం– గౌరవంగా తలకు చుట్టే వస్త్రాన్నివలె) శిరసా వహిస్తావు. (ఆదరంగా స్వీకరిస్తావు)

**58) తుహముహజోణ్హా దావిఅ మాణస ససి అన్త పవహ సంణిహ బాహే।**

**అచ్చుఅ ణ ముఅసి భత్తే కళమ్బ గోళ ణిహ కణ్టఅన్త ణి అఙ్గే॥**

**తవ ముఖజ్యోత్స్నా ద్రావిత మానస శశి కాన్త ప్రవాహ సన్నిభ బాష్పాన్।**

**అచ్యుత న ముఞ్చసి భక్తాన్ కదమ్బగోళ నిభ కణ్టకాయమాన నిజాఙ్గాన్॥**

అచ్యుతా!నీ ముఖమండలంలోని కాంతి అనే వెన్నెలతో కరగిన తమ మనస్సు అనే చంద్రకాంతమణినుండి స్రవించే జలంవంటి బాష్పాలను కలవారై, కదంబపూల

మొగ్గలవంటి. రోమాంచంతో నిండిన అవయవాలను కలవారైన నీ భక్తులను నీవు ఏనాడూాశ విడచి పెట్టవు.

**59) సవ్వేసు వి ణివ్వేరా సరణాగఅ సచ్చ గహిఅ సాసాఅ ధమ్మాl**

**గఅసజ్గా తుహ భత్తా జన్తి తుమం ఏవ్వ దుళ్ళహం ఇఅరేహిమ్॥**

**సర్వేష్వపి నిర్వైరాః శరణాగతసత్య గృహీతశాశావతధర్మాःl**

**గతసజ్గాస్తవ భక్తాః యాన్తి త్వామేవ దుర్లభ మితరైః॥**

శరణాగతసత్యా! ప్రాణులందరిపట్ల శత్రుత్వాన్ని లేనివారై, సనాతనధర్మాన్ని పరిగ్రహించినవారై, ఇతరవిషయాలలో సంగాన్ని లేనివారైన నీ భక్తులు, ఇతరులెవ్వరూ పొందలేని నిన్ను పొందుతున్నారు

.

**60) అహివఇ ణఅరిన్ద తుమం ఆసణ్ణం వి గఅణం వ సఇ దుగ్గోజ్ఝమ్l**

**విసఏసువిలగ్గన్తా తూరన్తా వి ణ లహన్తి డోళన్త మణా॥**

**అహిపతి నగరేన్ద్ర త్వా మాసన్న మపి గగనమివ సదా దుర్గ్రహమ్।**

**విషయేషు విలగన్తః త్వరమాణా అపి న లభన్తే డోలాయమాన మనసః॥**

తిరువహీంద్రపురంలోని స్వామీ! ఇహలోక సుఖాలలో ఆసక్తిని కలవారై, చంచలమైన మనస్సును కలవారు నిన్ను పొందాలని త్వరపడినా, వారికి ఎల్లప్పుడు సమీపంలో నీవున్నా, ఆకాశంవలె తెలియ సాధ్యం కాని నిన్ను వారు పొందలేరు.

**61) భత్తా తావఅ సేవా రసభరిఆ సఅలరక్ఖణోసు అ రూఇణా ।**

**కరణాఇ ధరన్తి చిరం కఙ్ఖిఅ మోఖ్ఖా వి అచ్చుఅ తుఏ ఠవిఆ॥**

**భక్తాస్తావక సేవా రస భరితాః సకలరక్షణోత్సుకరుచినా।**

**కరణాని ధరన్తి చిరం కాఙ్క్షితమోక్షా అప్యచ్యుత త్వయా స్థాపితాః॥**

అచ్యుతా!నీ భక్తులు చిరకాలంగా మోక్షాన్ని కోరుతున్నా, ఇక్కడే అర్చారూపంలో ఉండే నీకు కైంకర్యం చేయడంలో మిక్కిలి ప్రీతిని కలవారై, నీ దయను అందరికి కలిగించి,

కాపాడడంలో ఉత్సాహంతో కూడిన రుచిని పొందినవారై, ఈ లోకంలో నిలచి తమ శరీరాలను ధరిస్తున్నారు.

**62) థిరగుణ గిరి జణి ఏహిం సంతారేసి ణఅసచ్చ ణి అ భత్తేహిమ్l**

**జమ్మ పరివాడి జలహిం జఙ్గమ థిర సే ఉ దంసణిజ్జేహి జణే॥**

**స్థిరగుణ గిరి జనితైః సన్తారయసి నతసత్య నిజభక్తైఃl**

**జన్మపరిపాటి జలధిం జఙ్గమ స్థిర సేతు దర్శనీయజనాన్॥**

నతసత్యా! స్థిరమైన(గొప్ప)గుణాలనే పర్వతాలతో కూడినవారు (నిర్మింపబడినవారు), నడిచే, దృఢమైన వారధివలె దర్శిందగినవారైన నీ భక్తులద్వారా నీవు జనులను జన్మపరంపర అనే సముద్రంనుండి దాటిస్తున్నావు.

**63) పసమిఅ భవన్తర భఆ పత్తంపత్తం హిఅం తి పరపేచ్ఛన్తాl**

**భావేన్తి చుజ్జ భత్తా పిఅఇహిం వ ణఅసచ్చ పచ్చిమ దిఅహమ్॥**

**ప్రశమిత భవాన్తర భయాః ప్రాప్తం ప్రాప్తం హితమితి పరిపశ్యన్తః।**

**భావయన్తి తవ భక్తాః ప్రియాతిథిమివ నతసత్య పశ్చిమ దివసమ్॥**

నతసత్యా!నీ భక్తులు మరు జన్మ కలుగుతుందేమో!అనే భయం తీరినవారై, ఆ యా సమయాలలో వచ్చే ఫలాన్ని హితమని భావించేవారై, అంతిమకాలంకోసం, ప్రియమైన అతిథికోసంవలె, ఎదురు చూస్తారు.

**64) పఅడ తిమిరమ్మి హువణే పత్తపడిట్ఠావిఅ పరమ ణాణ పఈవా।**

**ణిజ్జన్తి అచ్చుఅ తుఏ ణిఅం పఅం సఇ సఅం పహం కఅకజ్జా॥**

**ప్రకట తిమిరే భువనే పాత్ర ప్రతిష్ఠాపిత పరమజ్ఞాన ప్రదీపాః।**

**నీయన్తేఽచ్యుత త్వయా నిజం పదం సదా స్వయం ప్రభకృత కార్యాః॥**

అచ్యుతా!అజ్ఞానమనే చీకటి వ్యాపించిన లోకంలో తగిన పాత్రలో (శిష్యునకు) చక్కగా పెట్టిన (ఉపదేశించిన) మంచి జ్ఞానమనే దీపాన్ని కలవారై, కృతార్థులైన నీ భక్తులను ఎల్లప్పుడూ స్వయంగా ప్రకాశించే, నీ స్థానమైన పరమపదానికి తీసికొనిపోతావు.

**65) దిఢ తివ్వ భత్తి ణఅణా పరిపేచ్ఛన్తా అహిన్దఉరణాహతుమమ్l**

**పత్తా తుహ  సాఉజ్జం పన్తిం  పూరేన్తి పణ్ణాఇన్ద ముహాణమ్॥**

**దృఢతీవ్ర భక్తినయనాః పరిపశ్యన్తోహీన్ద్రపురనాథ త్వామ్l**

**ప్రాప్తాస్తవ సాయుజ్యం పఙ్క్తిం పూరయన్తి పన్నగేన్ద్ర ముఖానామ్॥**

తిరువహీంద్రపురంలోని స్వామీ! దృఢమైన, నిశితమైన జ్ఞానాన్ని నేత్రంగా కలవారు, నిన్ను సాక్షాత్ దర్శించేవారు, నీతో సామ్యాన్ని పొందినవారైన భక్తులు ఆదిశేషుడు మొదలైనవారి గోష్ఠిని చేరుతున్నారు.

**66) సంణఅ సులహం అచ్చుఅ సమాహి సోవాణ కమ విళమ్బ విముహిఆl**

**సరణంగన్తూణ తుమం ముత్తా  ముఉన్ద ఖత్తబన్ధు ప్పముహా॥**

**సన్నతసులభమచ్యుత సమాధి సోపానక్రమవిలమ్బ విముఖితాఃl**

**శరణం గత్వా త్వాం ముక్తా  ముచుకున్దల క్షత్రబన్ధు ప్రముఖాః॥**

అచ్యుతా!ముచుకుందుడు, క్షత్రబంధువు మొదలైనవారు భక్తియోగంలోని దశలను ఆచరించే క్రమంలో ఏర్పడే ఆలస్యాన్ని సహించలేనివారైనందున. వానిని విడచిపెట్టి, నిన్ను నమస్కరించినవారికి సులభుడవైన నిన్ను శరణు పొంది, ముక్తిని పొందారు.

**67) దేవాణ పసు సమాణో జన్తూ గన్తూణ దేవణాహ తుహ పహమ్।**

**తేహిం చిఅ సవ్వేహిం సంసరమాణేహి హోఇ సఇదిణ్ణ బలీ॥**

**దేవానాం పశు సమానో జన్తుర్గత్వా దేవనాథ తవ పదమ్।**

**తై రేవ సర్వై స్సంసరమాణైః భవతి సదా దత్తబలిః॥**

దేవనాయకా! దేవతలతో పోలిస్తే, పశువుతో సమానుడైన ఈ జీవుడు నీ స్థానమైన వైకుంఠాన్ని పొంది, సంసారంలో పరిభ్రమించే వారందరిచేతనే (దేవతలచేతనే) సదా కానుకలు సమర్పింపబడినవాడవుతున్నాడు. (గౌరవింపబడతాడు)

**68) మోహన్ధార మహణ్ణవ ముచ్ఛిఅ మాఆ మహోరఅణి పచ్ఛాహో।**

**అచ్చుఅ తుజ్ఝ కడక్ఖో విముత్తిపత్థాణ పుడమ పరిఅర బన్ధో ॥**

**మోహాన్ధకారమహార్ణవ మూర్ఛిత మాయామహారాజని ప్రత్యూషః।**

**అచ్యుత తవ కటాక్షో విముక్తి ప్రస్థాన ప్రథమ పరికర బన్ధః॥**

అచ్యుతా!మోహమనే గొప్ప అంధకా రసముద్రంతో వ్యాప్తమైన ప్రకృతి అనే గొప్ప రాత్రికి సుప్రభాతమైన నీ కటాక్షం మోక్షంకోసం చేసే ప్రయాణానికి మొదట చేయబడే సాధన మవుతున్నది(నీ కటాక్షమే మోక్షానికి మొదటి కారణం.)

**69) మోక్ఖ సుహ రుక్ఖమూళం మోహజరాఉరమహారసాఅణ పవరమ్ ।**

**సఏల కుసలేక్క ఖేత్తం కింకరసచ్చ తుహ కిత్తణం అమిఅ ణిహమ్ ॥**

**మోక్షసుఖ వృక్షమూలం మోహ జరాతుర మహారసాయన ప్రవరమ్ ।**

**సకల కుశలైక క్షేత్రం కిఙ్కర సత్య తవ కీర్తన మమృతనిభమ్ ॥**

నతసత్యా!మోక్షానందమనే వృక్షానికి వేరువంటిది, మోహమనే ముసలితనంవల్ల బాధపడేవారికి గొప్ప సిథ్థౌషధంవంటిది, అన్ని మంగళాలను కలిగించేది, సాటి లేని క్షేత్రమైన తిరునామసంకీర్తనం అమృతంవంటిది.

**70) ణత్థి అహిక్కమ ణాసో బిచ్ఛే అమ్మి వి ణ పచ్చవాఅ పసఙ్గో l**

**సప్పా వి తుహ సపజ్జా రక్ఖఇ అచ్చుఅమహత్తరాదు భఆదో ll**

**నాస్త్యభిక్రమ నాశో విచ్ఛేదేऽపి న ప్రత్యవాయ ప్రసఙ్గః l**

**స్వల్పాऽపి తవ సపర్యా రక్షత్యచ్యుత మహత్తరాత్ భయాత్ ll**

అచ్యుతా! నీ ఆరాధనలో ప్రారంభించిన భాగం వ్యర్థం కావడం అనేది లేదు. మధ్యలో విడచి పెట్టినా పాపం రాదు. చేసిన నీ ఆరాధనం చాలా చిన్నది అయినా, అది పెద్ద ఆపదనుండికూడా కాపాడుతుంది.

**71) అపసాఏ అపసణ్ణా తుజ్ఝ పసాఅమ్మి దాససచ్చపసణ్ణా l**

**ఆరజ్ఝ హోన్తి పరే కి తేహి పసజ్జ లమ్భిఅ పహోవేహిమ్ ll**

**అప్రసాదే అప్రసన్నా స్తవ ప్రసాదే దాససత్య ప్రసన్నాః l**

**ఆరాధ్యా భవన్తి పరే కి తైః ప్రసఙ్గలమ్భిత ప్రభావైః ll**

దాససత్యా!అన్యదేవతలు నీ దయ లేకపోతే ప్రసన్నులు కారు. నీ కరుణ ఉంటేనే అనుగ్రహించేవారు పూజింపదగినవారు అవుతున్నారు. నీ సంబంధంవల్ల గొప్పతనాన్ని పొందే ఆ దేవతలవల్ల ఏమి ప్రయోజనం?

**72) ఇఅర తిఅసా పసణ్ణా కింకరసచ్చ మహ కిం ణు కాహిన్తి హిఅమ్ l**

**ణీహార ఘణ సఏహిం ణహు పూరిజ్జఇ కహం వి చాఅఅ తిణ్హా ll**

**ఇతరత్రిదశాః ప్రసన్నాః కిఙ్కరసత్య మమ కిం ను కరిష్యన్తి హితమ్ l**

**నీహారఘనశతైః న ఖలు పూర్యతే కథమపి చాతక తృష్ణా ll**

భక్తసత్యా! దేవతాంతరాలు ప్రసన్నులైనా, నాకు ఏ మంచిని చేయగలరు ? మంచును కురిసే వందలాది మేఘాలైనా చాతకపక్షిదాహాన్ని తీర్చగలవా?

**73) అణుగఅసుహ మిఅతిణ్హా అచ్చుఅవీసమఇ తుజ్ఝ మామఅ తిణ్హా l**

**పవహేసు పసరిఆఏ ఆసిఅ పవహన్త ఘుణ కివా సరిఆఏ ll**

**అనుగతసుఖ మృగతృష్ణా అచ్యుత విశ్రామ్యతి  తవ మామక తృష్ణా l**

**ప్రవాహేషు ప్సృతాయాః ఆశ్రిత ప్రవహద్ఘన కృపా సరితః ll**

అచ్యుతా! .లౌకికసుఖాలనే ఎండమావులవెంట పరుగు తీసిన నా దాహం (ఆర్తి)అంతటా ప్రవహిస్తూ, నీ భక్తులదగ్గర ప్రవహించే కరుణ అనే గొప్ప నదిలో ఉపశమిస్తున్నది.

**74) విఅల సఅలఙ్గ విసమే  ధమ్మే ణఅసచ్చ ధఅణిహే ధారేన్తో l**

**కన్తార పన్థఓ విఅ ఖలన్త చలణో మ్హి ఖాఅర విసీరన్తో ll**

**వికల సకలాఙ్గ విషమాన్ ధర్మాన్ నతసత్య ధ్వజనిభాన్ధారయన్ l**

**కాన్తార పాన్థక ఇవ స్ఖలచ్చరణోऽస్మి కాతర విశీర్యమాణః ll**

భక్తసత్యా! నేను ఆచరించే ధర్మాలలో అన్ని అంగాలు వికలమవుతున్నాయి. విపరీతాలైన ఆ ధర్మాలను ఆడంబరంకోసం, లోకం నన్ను వైదికుడనని భావించేటట్లు చేయడంకోసం, ఆచరిస్తున్నాను ఇది– లోకంలో ఒఃడు తన గొప్పతనాన్ని ప్రదర్శించుకోవడంకోసం ఒక ధ్వజాన్ని(జెండాను)పెట్టుకొన్నట్లున్నది. ఈ విధంగా ఉండే నేను అడవిలో దారి తెలియని బాటసారివలె కాలు తడబడుతూ, భయంతో అలమటిస్తున్నాను. నన్ను కాపాడు.

**75) ఠిర ధమ్మవమ్మయఇఅం అధమ్మ పవణాణ అగ్గ ఖన్ధ పవట్టమ్ ।**
**అఘుడన్త విపడిసారం అచ్చుఅ మం హససి ణూణ లచ్ఛి సమక్ఖమ్ ॥**

**స్థిరధర్మ వర్మ స్థగితమధర్మప్రవణానామగ్ర స్కన్ధ ప్రవృత్తమ్ ।**
**అఘుటమాన విప్రతీసారమచ్యుత మాం హససి నూనం లక్ష్మీ సమక్షమ్ ॥**

అచ్యుతా! నేను స్థిరమైన ధర్మాలనే కవచాన్ని పైన ధరించాను. వాస్తవానికి అధర్మాలలోనే ఆసక్తిని కలిగి ఉన్నవారిలో ముందున్నాను. పశ్చాత్తాపమనేది లేకుండా ఉన్నాను. ఇటువంటి నన్ను లక్ష్మీదేవి ఎదుట నీవు తప్పక వేళాకోళం చేస్తావు. ఇది నిజం.

76) తరిఉం అచ్చుఅ దురిఅం ఇమమ్మి దేహమ్మి ఏక్క దిఅహే వి కఅమ్ ।

కాళో అళం న సఅళో కలుణాఏ తుజ్ఝ పుణ్ణపత్తం మ్హి ఇమో ॥

తరితు మచ్యుత దురితషమస్మిన్ దేహ ఏక దివసేఽపి కృతమ్ ।

కాలోఽలం న సకలః కరుణాయా స్తవ పూర్ణపాత్ర మస్మ్యయమ్ ॥

అచ్యుతా!ఈ శరీరంలో ఒక నాడు నేను చేసిన పాపాన్ని పోగొట్టుకోవడానికి కాలమంతాకూడా చాలదు. అందువల్ల నీ దయకు పూర్ణమైన పాత్రమై, ఇదిగో, నేనున్నాను.

77) అచ్చుఅ తుజ్ఝ గుణాణం మహ దోసాణం వి ణత్థి కుత్థవి గణణా ।

తహ వి జఓపుఢమాణం అహిఅం లీణాణ హోఇ ణహు దోబ్బలమ్ ॥

అచ్యుత తవ గుణానాం మమ దోషాణామపి నాస్తి కుత్రాపి గణనా ।

తథాపి జయః ప్రథమానామ్ అధికలీనానాం భవతి న ఖలు థౌర్బల్యమ్ ॥

అచ్యుతా!నీ కల్యాణగుణాలకు, నా పాపాలకు లెక్క లేదు. అయినా, మొదట పలికిన నీ గుణాలకే జయం కలుగుతున్నది. ఎక్కువగా మరగుపడి ఉండేవారికి దౌర్బల్యమేకదా ఉంటుంది!(నీ గుణాలను చూచి నా దోషాలు కనుపించకుండా పోయాయంటే అవి బలం లేనివేకదా!)

**78) రత్తిం దిఅహం అచ్చుఅ తుడిఅ పఇన్తాఇ ఆఉ దుమ ఖణ్డాఇమ్ l**

**దఠ్ఠూణ వి దరి అమణం బాలం ఏణ్హిం వి భరసు మం అపమత్తో ll**

**రాత్రిం దివస మచ్యుత త్రుటిత పతన్త్యాయుర్ద్రుమఖణ్డాని l**

**దృష్ట్వాపి దృప్త మనసం బాల మిదానీ మపి భరస్వ మా మప్రమత్తః ll**

అచ్యుతా! ప్రతి రాత్రి, పగలు తరిగిపోయి, ఒకనాడు పతనం చెందే ఆయుస్సు అనే వృక్షఖండాలను చూస్తూ ఉన్నా, గర్వించిన మనస్సు కలవాడనై, ఇప్పటికీ బాలుడనై(అజ్ఞుడనై)ఉండే నన్ను గమనించి, రక్షించు.

**79) ణీసాస సంకణిజ్జే దేహే పడళన్త సళిళ బిన్దు సరిచ్ఛే l**

**ముణసి ణఅసచ్చ తుమం జరన్త కరణే వి దీహజోవణ్ణ తిణ్హామ్ ll**

**నిస్స్వాస శఙ్కనీయే దేహే పటలాన్త సలిల బిన్దు సదృక్షే ।**

**జానాసి నతసత్య త్వం జరత్కరణేऽపి దీర్ఘయౌవనతృష్ణామ్ ॥**

నతసత్యా!మరు క్షణంలో శ్వాస ఆడుతుందా? లేదా?అని సందేహించే రీతిలో ఉన్నది, ఇంటి చూరు చివర మరు క్షణంలో రాలి పడిపోవడానికి సిద్ధంగా ఉన్న నీటిబిందువువంటిది అయిన నా శరీరం జీర్ణించిన ఇంద్రియాలతో ఉన్నా నీవు నన్ను ఇంకా దీర్ఘమైన యౌవనంలో ఆశ కలిగినవానినిగా తలుస్తున్నావు. (ముసలితనంలోకూడా మళ్ళీ యౌవనాన్ని పొందాలనే అజ్ఞానిని అయిన నాకు నీ కరుణ తప్ప వేరు గతి మాకు లేదు.)

**80) అముణిఅ ణిఅ కాఅవ్వం తుళగ్గ ముణిఏసు మం వి పడిఊళ గఇమ్ ।**

**ఇఅ ణిఅ సహావ విళఅం హాేఉం దాసాణ సచ్చ ణహు తుహ జుత్తమ్ ॥**

**అజ్ఞాత నిజ కర్తవ్యం యదృచ్ఛయా జ్ఞాతేషు మామపి ప్రతికూల గతిమ్ ।**

**ఇతి నిజస్వభావ వ్రీళితం హాతుం దాసానాం సత్య న ఖలు తవ యుక్తమ్॥**

దాససత్యా! నేను చేయవలసిన కర్తవ్యాలనుగూర్చి తెలియనివాడనై, యాదృచ్ఛికంగా తెలిసిన కర్తవ్యాలలోకూడా వ్యతిరేకంగా ప్రవర్తించేవాడనై, ఈ

విధంగా ఉండే నా స్వభావంవల్ల లజ్జను పొందినవాడనైన నన్ను విడచిపెట్టడం నీకు తగదుకదా!

81) కోహం కి కరణిజ్జం పరిహరణిజ్జం వి కింతి జాణసి సవ్వమ్ l
తీరసి అ తం హిఅం మహ తిఅసేసర కుణసు ణిఅ హిఅఅ ణిక్ఖిత్తమ్ ll

కోऽహం కిం కరణీయం పరిహరణీయ మపి కిమితి జానాసి సర్వమ్ l
శక్నోషి తద్ధితం మమ త్రిదశేశ్వర కురుష్వ నిజహృదయ నిక్షిప్తమ్ ll

దేవనాయకా!షనేనెవరు?నాకు నీవు చేయవలసినది ఏది ? విడువవలసినది ఏది? అనే విషయం అంతా నీకు తెలుసు. నాకు హితాన్ని చేయగల శక్తికూడా నీకున్నది. అందుచేత నా విషయంలో నీవు మనస్సులో ఏది హితమని తలచావో దానిని అనుగ్రహించు.

82) ఏణ్హిం ఉవరి  వి ఇమో గుణ గహిఓ దారు పుత్తఓ  వ పరవసో l
తస్సవి మహ తిఅసేసర తీసు వి కరణేసు హోసు సుహ సజ్ఞపో్వ॥

**ఇదానీముపర్యప్యయం గుణగృహీతో దారు పుత్రక ఇవ పరవశః l**

**తస్యాపి మమ త్రిదశేశ్వర త్రిష్వపి కరణేషు భవ ముఖ సఙ్కల్పః ll**

దేవనాయకా!ఇటువంటి నేను ఇపుడు, రాబోయే కాలంలోను త్రిగుణాలతో బంధింపబడినవాడనై, దారాలతో కట్టి ఆడించే, కొయ్యబొమ్మవలె నీకు పరవశుడనై ఉన్నాను. ఈ విధంగా ఉండే నాకు త్రికరణాలతో హితాన్ని చేసే సంకల్పాన్ని కలవాడవుగా నీవు కావాలి.

**83) ణిఅ కమ్మణిఅళ జుఅళం అచ్చుఅ కాఊణ మహ పిఅప్పిఅ వగ్గే l**

**కాహే ఘోరకళేబర కారాఘర కుహర ణిగ్గఅం కాహిసి మమ్ ll**

**నిజకర్మనిగళయుగళం అచ్యుత కృత్వా మమ ప్రియాప్రియవర్గే l**

**కదా ఘోర కలేబర కారాగృహ కుహర నిర్గతం కరిష్యసి మామ్ ll**

అచ్యుతా! నా పుణ్యపాపాలనే రెండు విధాలైన సంకెళ్ళను నన్ను ప్రేమించేవారు, నన్ను ద్వేషించేవారు – అనే రెండు వర్గాలవారికి కలిగేటట్లు చేసి (పుణ్యాన్ని నా హితులకు, పాపాన్ని నా అహితులకు చెందేటట్లు చేసి,) నన్ను

భయంకరమైన, శరీరమనే చెరసాలద్వారంనుండి బయటపడినవానినిగా ఎపుడు చేస్తావు?

84) హద్దే తుమమ్మి కఇఅవిస్సమిఅం బమ్హ ధమణిమగ్గ ణిహిన్తమ్ ।
దిణఅర దిణ్ణగ్గ కరం అచ్చుఅ దచ్ఛిహిసి దఇఅ డిమ్భం విఅ మమ్ ॥

హార్దే త్వయి కదా విశ్రాన్తం బ్రహ్మ ధమని మార్గ గమిష్యన్తమ్ ।
దినకరదత్తాగ్ర కరమ్ అచ్యుత ద్రక్ష్యసి దయిత డిమ్భమివ మామ్॥

అచ్యుతా! నా హృదయంలో ఉండే నీవు నాకు అంతిమసమయంలో కలిగే శ్రమ అంతా తీరేటట్లు నీదగ్గరకు చేర్చుకొని. శ్రమ తీరినవానినిగా చేసి, బ్రహ్మనాడిద్వారా బయటకు వెలువడేవాడనై, సూర్యునిచే ఇవ్వబడిన కిరణాలనే చేయూతను పొందినవాడనై ఉండే నన్ను ప్రియమైన బాలకునివలె ఎపుడు కటాక్షిస్తావు?

85) కాహే అమాణవన్తా అగ్గిముహా ఆఇవాహిఆ తుహ పురిసా ।

**అఇళజ్జేహిన్తి మిమం అచ్చుఅ తమ గహన తిఉణ మరుకాన్తారమ్ ॥**

**కదా అమానవాన్తాః అగ్నిముఖాః ఆతివాహికాస్తవ పురుషాః l**

**అతిలఙ్ఘయిష్యన్తి మామచ్యుత తమోగహన త్రిగుణ మరు కాన్తారమ్॥**

అచ్యుతా! అగ్ని మొదలు అమానవునివరకు ఉండే ఆతివాహకులైన నీ పురుషులు నన్ను తమోగుణంతో దట్టమైన సంసారమండలమనే ఎడారినుండి ఎపుడు దాటిస్తారు?

**86) లఙ్ఘిఅ విరఆ సరిఅం లమ్భిఅ సఇ సుద్ద సత్తమఅ సోమ్మ తణుమ్ l**

**కఅ బమ్హాలఙ్కారం కాహిసి ణఅసచ్చ కింకరం కాహే మమ్ ॥**

**లఙ్ఘిత విరజా సరితం లమ్భిత సదాశుద్ధ సత్త్వమయ సౌమ్యతనుమ్l**

**కృత బ్రహ్మాలఙ్కారం కరిష్యసి నతసత్య కిఙ్కరం కదా మామ్॥**

నతసత్యా! విరజానదిని దాటినవానినిగా, నిత్యం శుద్ధసత్త్వగుణాన్ని కల, అందమైన శరీరాన్ని పొందినవానినిగా, బ్రహ్మాలంకారంతో అలంకరింపబడినవానినిగా, నీకు శాశ్వతకైంకర్యాన్ని చేసేవానినిగా నన్ను ఎపుడు చేస్తావు?

87) సంసార సాఅరాఓ ఉక్ఖిత్తం తిఅస ణాహ ఫురిఆళోఅమ్ l
కాహే కాహిసి హిఅఏ కోత్థుహ మణి దప్పణం వ లచ్ఛి పుళఇఅమ్ ll

సంసారసాగరాదుక్షిప్తం త్రిదశనాథ స్ఫురితాలోకమ్ l
కదా కరిష్యసి హృదయే కౌస్తుభమణి దర్పణమివ లక్ష్మీ పులకితమ్ ll

దేవనాయకా! సంసారసముద్రంనుండి ఉద్ధరింపబడినవాడనై, జ్ఞానప్రకాశం వికసించినవాడనైన నన్ను, లక్ష్మీదేవి కటాక్షించే కౌస్తుభరత్నమనే అద్దంవలె వక్షస్సులో ఎపుడు ధరిస్తావు?

88) కాహే తుహ పఅ పఉమే హోహిమి ణఅసచ్చ కేళి కన్తతిహువణే l
మఅణ రిఉ మఉడ మణ్డణ సుర సరిఆ సోత్త సూఇఅ ణహు ప్పవహే ll

కదా తవ పాదపద్మే భవిష్యామి నతసత్య కేలి క్రాన్తత్రిభువనే l
మదనరిపు మకుట మణ్డన సుర సరిత్స్రోతః సూచిత మధు ప్రవాహే॥

నతసత్యా! ముల్లోకాలను కొలిచే లీలను చేసినది, మన్మథుని శత్రువైన శివుని శిరస్సుకు అలంకారమైన దేవగంగాప్రవాహమనే తేనె వెల్లువను కలిగినది అయిన నీ చరణపద్మంలో ఎపుడు నేను చేరగలను ?

**89) ఉవణిఅసా సిర కుసుమం ఉత్తంసేఊణ తుహ పఅమ్బుఅ జుఅళమ్ l**

**దఇఓ హోహిమి కఇఆ దాసో దాసాణ సచ్చసూరి సరిచ్ఛో॥**

**ఉపనిషచ్ఛిరః కుసుమ ముత్తంసయిత్వా తవ పాదామ్బుజ యుగళమ్l**

**దయితో భవిష్యామి కదా దాసో దాసానాం సత్య సూరి సదృశః ॥**

దాససత్యా! ఉపనిషత్తులు తమ శిరస్సులో అలంకరించుకొనే పూలవంటి నీ రెండు చరణ పద్మాలను నా తలకు ఆభరణంగా చేసికొని, నిత్య సూరులవలె నీకు ఇష్టమైనవాడను ఎపుడు కాగలను?

**90) అడణో ణిడత్తి జోగ్గం ఓఅర విహోర సహాఅరత్తణ ఘణిఅమ్ l**

**అప్ప సమభోఅ మేత్తం అణుహోహిసి దేవణాహ కాహే ణుమిమమ్ ॥**

**అపునర్నివృత్తియోగ్య మవతారవిహారసహచరత్వ ధన్యమ్ l**

**ఆత్మ సమ భోగమాత్రం అనుభవిష్యసి దేవనాథ కదా ను మామ్॥**

దేవనాయకా! ఈ లోకంలో మళ్ళీ జన్మించడమనే పునరావృత్తిని లేనివాడనై, నీవు అవతరించి, లీలావిహారాలను చేసేటపుడు నీవెంటనే ఉండి అనుభవించడంవల్ల ధన్యుడనుగా, అనుభవంలోమాత్రం నీతో సమానునడనుగా నన్ను చేసి, ఎపుడు ఆనందిస్తావు?,

**91) ఇఅ ఫుడ మణోరహం మం ఏఆరిస వఅణ మేత్త సారం వసఅమ్ l**

**కుమసు నిఅ గుణ గణేహిం సచ్చం దాసాణ సచ్చ సఇ సచ్ఛన్దో ॥**

**ఇతి స్ఫుటమనోరథం మాం ఏతాదృశ వచనమాత్ర సారం వశగమ్ l**

**కురుష్వ నిజగుణగణైః సత్యం దాసానాం సత్య సదా స్వచ్ఛన్దః ॥**

దాససత్యా!ఈ విధంగా ఆశను వ్యక్తం చేసినవాడనై, ఇటువంటి మాటలను పలుకడం తప్ప వాటికి తగిన ఏ పనిని చేయనివాడనై, నీకు వశమైనవాడనైన నన్ను సదా

స్వతంత్రుడవైన నీవు నీ గుణగణాలతో ఆశపడినవానినిగా అనుగ్రహించి, సత్యమైనవానినిగా(నా ఆశలను సత్యంగా) చేయాలి.

**92) బాళ పవగోవ్వ తరళో మారుఇ జాఇత్తి సాఅరం తరిఉ మణో ॥**

**పత్థేమి తుమం అచ్చుఅ కఙ్ఖిఅ పఅ పఉమ ఖమసు మహ కావేఅమ్॥**

**బాల ప్లవగఇవ తరళో మారుతి జాతిరితి సాగరం తరితుమనాః ।**

**ప్రార్థయే త్వామచ్యుత కాంక్షిత పదపద్మ క్షమస్వ మమ కాపేయమ్ ॥**

అందరు ఆశపడే పదపద్మాలను కల అచ్యుతా! "హనుమంతుని జాతికి చెందినవాడను "అని నన్ను తలచి, సముద్రాన్ని దాటగోరిన చిన్న వానరంవలె చంచలుడనైన నేను నిన్ను వేడుతున్నాను. నా కోతిచేష్టలను నీవు క్షమించు.

.

**93) అచ్చుఅ విసఅక్కన్తం భవణ్ణవా వత్త భమి ణితుత్తిఙ్ఙన్తమ్ ।**

**జణణీ థణంధఅం విఅ మం ఉద్ధరిఊణ సేవసు సఅం పచ్ఛమ్॥**

**అచ్యుత విషయాక్రాన్తం భవార్ణవావర్త భ్రమి నిస్తృత్యమానమ్।**

**జననీ స్తనన్ధయ మివ మాముద్ధృత్య సేవస్వ స్వయం పథ్యమ్॥**

అచ్యుతా! లౌకికసుఖాలకు వశమైనవాడను, సంసారమనే సముద్రంలోని సుడులలో భ్రమిస్తూ మునిగిపోయేవాడనైన నన్ను పాలు తాగే చఃటిబిడ్డనువలె దగ్గరకు తీసికొని, నీవే నా మంచిని స్వీకరించు. (తల్లి తన బిడ్డకు కలిగిన వ్యాధి తీరడంకోసం తానే తగిన ఔషధాన్ని స్వీకరించేటట్లు, నీవే నా హితాన్ని చింతించి, దానిని చేయాలి)

**94) కమ్మ మఅ ధమ్మ తవిఅం సుహ మిఅ తిణ్హాహి కాహి వి అతిణ్ణాహమ్।**

**కారేసు ణివ్వుఅం మం కరఆ సిసిరేహి అచ్చుఅ కడక్ఖేహిమ్॥**

**కర్మమయధర్మ తప్తం ముఖమృగతృష్ణాభిః కదాऽప్యతృష్ణకమ్।**

**కారయ నిర్వృతం మాం కరకా శిశిరైరచ్యుత కటాక్షైః॥**

అచ్యుతా! కర్మలనే వేడిమివల్ల తపింపబడినవాడనై, లౌకికసుఖాలనే ఎండమావులవల్ల చల్లబడనివాడనైన నన్ను కరకాలవంటి నీ కటాక్షాలతో చల్లబడినవానినిగా (ఆనందాన్ని పొందినవానినిగా) చేయాలి.

**95) తుహ చిన్తణ విముహాణం దిట్ఠి విసాణం వ దంసణాఉ మోఏన్తో l**

**అమిఅ ముహాణం వి అ మం అచ్చుఅ భత్తాణ ణేసు ణఅణఆసారమ్॥**

**తవ చిన్తన విముఖానాం దృష్టివిషాణ మివ దర్శనాన్మోచయన్l**

**అమృతముఖాన మివ మామచ్యుత భక్తానాం నయస్వ నయనాసారమ్॥**

అచ్యుతా!చూపులోనే విషాన్ని కల సర్పాలవంటివారు, నిన్ను చింతించనివారి చూపులనుండి నన్ను విడిపించి అమృతాన్ని ముఖంలో కలిగినవారివలె ఉండే నీ భక్తుల కటాక్షప్రవాహాన్ని నేను పొందేటట్లు చేయాలి.

**96) విస మిళిఅ మహు ణిహేసుఅ తిణ పడిమేసు అ పడిగ్గహేసు పఞరిఅమ్l**

**అమిఅ ణిహిమ్మి వ అచ్చుఅ తావేసు తుమమ్మి ణిమ్మమం మహ హిఅఅమ్॥**

**విషమిలిత మధునిభేషు చ తృణ ప్రతిమేషు చ ప్రతిగ్రహేషు ప్రలురితమ్l**

**అమృతనిధావివాచ్యుత స్థాపయ త్వయి నిర్మమం మమ హృదయమ్॥**

అచ్యుతా!విషం కలిసిన తేనెవంటివి, తృణంతో సమానమైనవి అయిన ఇహలోకవిషయాలలో పొరలే నా మనస్సును మిగిలిన ఏ విషయంలోను సంబంధం లేకుండా చేసి, అమృతనిధివంటి నీవద్దకు చేర్చుకో.

**97) ణిచ్చం ఇమమ్మి కివణే ణిఖ్ఖివసు ణమన్త సచ్చ ణిహి సారిచ్ఛేl**

**పవహన్త ణహ పహోఝర పసమిఅ పణమన్త సంజరే తుహ చళణే॥**

**నిత్య మస్మిన్ కృపణే నిక్షిప నమత్సత్య నిధి సదృక్షౌl**

**ప్రవహన్నఖప్రభా ఝర ప్రశమిత ప్రణమత్సంజ్వరౌ తవ చరణౌ॥**

భక్తసత్యా! ఎల్లప్పుడు తక్కువవాడనై ఉండే నాపై నిధివంటివి, ప్రవహించే నఖకాంతుల ప్రవాహాలతో భక్తుల తాపాలను తీర్చేవి అయిన నీ చరణాలను పెట్టు.

98) సరణాగఓత్తి జణిఏ జణవాఏ వి జఇ అచ్చుఅ మ రక్షసి మమ్॥
హేజ్జ ఖు సాఅర ఘోసో సాఅర పుళిణమ్మి తారిసం తుహ వఅణమ్॥

శరణాగత ఇతి జనితే జనవాదేऽపి యద్యచ్యుత న రక్షసి మామ్॥
భవేత్ ఖలు సాగర పులినే తాదృశం తవ వచనమ్॥

అచ్యుతా! నేను నిన్ను శరణు పొందాననే జనవాక్యం వినబడినా, నీవు నన్ను కాపాడకపోతే, సముద్రతీరంలోని ఇసుకతిన్నెపై నీవు(శ్రీరామావతారంలో) పలికిన ఆ మాట సముద్రఘోషేకదా అవుతుంది!

99) ణిక్షిత్తో మ్హి అ అగఈ ణివుణేహి తుమమ్మి ణాహ కారుణి ఏహిమ్।
తే తుహ దఠ్ఠూణ పిఏ భరిఅం ణఅసచ్చ భరసు అప్పాణ భరమ్॥

నిక్షిప్తోऽస్మి చాగతిః నిపుణై స్త్వయి నాథ కారుణికైః।
తాం స్తవ దృష్ట్వా ప్రియాన్ భృతం నతసత్య. భర స్వాత్మనో భరమ్॥

నతసత్యా! స్వామీ! వేరు గతి లేని నేను కరుణ నిండినవారై, సమర్థులైన ఆచార్యులచే నీ సన్నిధిలో సమర్పింపబడ్డాను. నీకు ఇష్టులైన ఆ ఆచార్యులను చూచి అయినా, నన్ను కాపాడే భారాన్ని నీవు స్థిరంగా స్వీకరించు.

100) ణఅసచ్చ పక్కణాణీఅ గళిఅ చిలాఅ భమ ణిఅ కుమారం వ ణి వో।
హోజ్జన్తజోవ్వణ వహుం వరోవ్వ మం లహసు మన్తి అణ విణ్ణావిఅమ్॥

**నతసత్య పక్కణానీత గళిత కిరాత భ్రమ నిజకుమారమివ నృపః।**
**భవిష్యత్యౌవనవధూం వర ఇవ మాం లభస్వ మన్త్రిజన విజ్ఞాపితమ్॥**

నతసత్యా!శబరుల(వ్యాధుల)గ్రామంనుండి తీసికొనిరాబడినవాడు, తాను వ్యాధుడననే భ్రమ తీరినవాడైన తన పుత్రుని, అతనినిగూర్చి మంత్రులు తెలియజేసినపుడు (తన పుత్రుని తిరిగి పొంది)అతనిని ఆంగీకరించే ప్రభువువలె, యౌవనం సమీపించిన కన్యను ఆమెకు తగిన వరునివలె, నన్ను నీవు స్వీకరించు.

101) ఇఅ కఇ తక్కిఅకేసరి వేఅన్తా అరియవేఙ్కడేస విరఇఅమ్॥
సుహఅం అచ్చుఅ సఅఅం సహిఅఅ హిఅఏసు సోహఉ సమగ్గగుణమ్॥

**ఇతి కవితార్కికకేసరి వేదాన్తాచార్య వేఙ్కటేశ విరచితమ్।**

**సుభగ మచ్యుతశతకం సహృదయ హృదయేషు శోభతాం సమగ్ర గుణమ్॥**

ఈ విధంగా కవులకు, తార్కికులకు సింహంవంటివారు, వేదాంతాచార్యులనే బిరుదును పొందినవారైన వేంకటకవిచే రచింపబడినది, భోగ్యమైనది, గుణాలన్నిటిని కలిగినది అయిన ఈ అచ్యుతశతకం సహృదయుల మనస్సులలో ప్రకాశించాలి.

**కవితార్కిక సింహాయ కల్యాణ గుణశాలినే,**

**శ్రీమతే వేఙ్కటేశాయ వేదాన్తగురవే నమః ॥**

**అచ్యుతశతకం సంపూర్ణమ్**

*****